# అన్న లింగార్చనావిధానం

(అన్నపూజా)

పరమశివుడికి చేసే పూజలలో అన్నలింగార్చన అన్నది ప్రత్యేకమైన గుర్తింపు పొందింది. అన్న విశిష్టత గురించి మనకు యజుర్వేదంలోని ఉపనిషత్తులలో, అదేవిధంగా అన్న సంబంధమైన మంత్రాలలో వివరించబడింది. పరబ్రహ్మ స్వరూపంగా కొనియాడబడింది. అటువంటి అన్నంతో శివార్చన చేసే విధానం మనకు పరంపరగా వస్తున్నది. అన్నలింగార్చన గురించిన ప్రస్తావన "స్మార్త శైవాగమప్రయోగ:" అనేగ్రంథంలో కనబడుతున్నది.

యథావిధిగా శివుడికి అభిషేకాన్ని నిర్వహించిన అనంతరం ముందుగానే సిద్ధం చేసుకున్న అన్నాన్ని శివలింగానికి అద్ది చక్కగా అలంకరిస్తారు. ఇందుకు ఉపయోగించే అన్నం శుచిగా, శుభ్రంగా ఉండాలి. అన్నం మెత్తగా ఉంటే అలంకరించడానికి సులువుగా ఉంటుంది. పూజ అయిన పిదప శివలింగాన్ని శుభ్రంగా కడిగి పున: పూజాదికాలను నిర్వహిస్తారు. శ్రావణమాసం సోమవారాలలో ఈ అలంకరణ విశేషంగా చెప్పబడింది. ఆ విధానాన్ని సేకరించి అందించబడుతున్నది.

****

సేకరణ

అప్పాల శ్యామప్రణీత్ శర్మ అవధాని

వేదపండితులు

గ్రా. అచ్చులాపూర్, మం: తాండూర్, జిల్లా, మంచిర్యాల

సెల్: 9440951366

# అన్న లింగార్చనా విధానం

॥శ్రీగణేశాయనమః॥

*******************************************************************

అన్నలింగార్చన చేసేప్పుడు సంకల్పాదులుచేసి శివుడికి యథాశక్తిగా అభిషేకాన్ని నిర్వహించిన పిదప; అన్నసంబంధమైన సూక్తాలు చదువుతూ శివలింగానికి అన్నాన్ని పూర్తిగా అద్దాలి. అద్దిన అన్నాన్ని ఆరుముఖాలుగా అలంకరించి అర్చన ప్రారంభించాలి.

**॥అథప్రయోగః॥**

అథ అన్న లింగస్య షడాననాని పరికల్ప్య।

ఓం హాం అన్నమయ శివాననాయనమః।

ఓం హాం అగ్నిమయ శివమూర్తయేనమః।

ఓం హాం హౌం అన్నమయ శివాయనమః।

**॥ధ్యానం॥**

శ్లో॥ ముక్తాకాతి విభాసితం శశివిభుం దుగ్ధాజ్య సంమిశ్రితం।
లోకానాం బలదం మనోజయకరం శుద్ధాన్న లింగం స్మరేత్॥

****

ఓం హాం అన్నమయ శివాయనమః। ఆవాహనాది ఉపచారాని సమర్ప్య।

ఓదనమితి మంత్రాని జప్త్వా। ధూప దీపాదికం దత్వా।

(ఓం హాం అన్నమయ శివాయనమః అనే మంత్రంతో ఉపచారాలన్నీ సమర్పించి ఈ క్రింది మంత్రం జపించాలి. అనంతరం తిరిగి ధూపదీపాలను సమర్పించాలి)

మం॥ ఓదనముద్బ్రువతే। పరమేష్ఠీవా ఏషః।
యదోదనః। పరమామేవైనగ్గ్ శ్రియంగమయతే॥

॥అన్న లింగార్చనా విధానం సమాప్తం॥

****